## గాంధీజీ, నెపోలియన్ తారతమ్యము

౧౮౧౫ సం॥ న ఇంగ్లాండువారు నెపోలియన్‌ను నొక ద్వీపాంతర కారాగృహమునకు బంపిరి. ౧౯౩౦ సం॥ న ఆంగ్లేయప్రభుత్వమువారు మహాత్మా గాంధిగారిని ఎఱ్ఱవాడ చెరసాలకంపిరి. రెండువిషయములలోను ముఖ్యకారణమొకటియే. ఇద్దరును స్థాపించి యుండెడి ప్రభుత్వమునకు భంగముచర్చిరి. అయితే ఇచ్చట భేదమేమన నెపోలియన్ చాల ఔన్నత్యదశయందు సిరిసంపదలతో గూడి యుండెను. నెపోలియన్ ప్రఖ్యాతనొందనే శ్రేష్ఠుడాయెను. తన భృత్యులకు హెచ్చువేతనము లిచ్చియు ప్రభుత్వములో ఉన్నతోద్యోగము లిచ్చియు పెంపొందెను. గాంధిగారు అకిరికత్వముగా వన్నెకువచ్చిరి. దేశసేవ యొనరించుట కవకాశము గలుగుటే గొప్పయంశమని ప్రజలకు తెలిపి ప్రజల విశ్వాసమును బడసిరి. నెపోలియన్ ద్వీపాంతరమునకు పోవునపుడొక యుద్ధనావలో గొంపోబడిరి. గాంధిగారు తనస్వల్పవస్తువులతో పోలీసుకారులో కారాగారమునకు గొంపోబడిరి. నెపోలియన్ జీవితములో కడపటి ఆరు సంవత్సరములు నొక పశువుల కొట్టములో తానుభవించిన జీవితమునుగురించి తలచుచుగడపెను. గాంధిగారు ఎఱ్ఱవాడ చెరసాలనేలపై గూర్చుండి రాటము త్రిప్పుచు, భావికాలనుగురించి భగవంతునికి ప్రార్థనలు సలుపుచున్నారు. నెపోలియన్ ద్వీపాంతరవాసములో ఉత్కృష్టుడై మరణించెను. గాంధిగారు కూడ చెరసాలలో మరణించినచో అశరీరత్వము నుపొందినట్లగును.

ప్రపంచమంతటను వ్యాపించియుండిన నెపోలియన్ ప్రభుత్వము అతనిమరణమునకు పూర్వమే శిథిలమైపోయెను. కత్తితో యుద్ధముజేసి నెలకొల్పిన రాజ్యములో తన్ను మోసగించిన స్వీడన్ రాజ్యము తప్ప మిగిలినవన్నియు విచ్ఛిన్నమై పోయెను. గాంధిగారి దయయనెడి శక్తి దినదినాభివృద్ధిగాంచుచున్నది. గాంధిగారి పలుకుబడికి యేలాటిహద్దులు లేవు దానంతట అదియే వ్యాపించుచున్నది. మానవునిశక్తియే దానిమూలము. అది చెరసాలగోడలను, రాష్ట్రీయహద్దులను అతిక్రమించి గా కడువేగముగా దాటి పోవుచున్నవి. దానికేమియు అటంకములు లేవు ప్రపంచములోనుండు యే బలవంతమైన ప్రభుత్వమును దానిని అటంకపరుపజాలదు. ఇప్పుడు గాంధిగారు మరణించినచో వారి ప్రేమరాజ్యము అశరీరత్వశక్తిగా ప్రభుత్వముగా ప్రపంచమంతటను వ్యాపించును.

### అమృతబజారు పత్రికనుండి 6000 రూపాయలు ధరావతు కోరుట

కలకత్తా జూన్ 28—

ఎన్. కె. జార్జి అను నతడు "ఇండియా ఇరువది వయిలు" అను శీర్షికకింద జార్జి అనువాడు వ్రాసిన వ్యాసమును మేనెల 25 వ తేదీని అమృతబజారు పత్రికలో ప్రకటించినందులకు కీవరు పబ్లిషరు 3000 ను ప్రింటరు 3000 ను జూలై నెల 25వ తేదీలోగా ధరావతు కట్టవలెనని నేను నోటీసు యివ్వబడెను.

## మీరటులో మండలసభ జరుగుట

### ౧౦౦ మందిని అరెస్టుచేయుట

మీరటు, జూన్ 12:—

మీరటులో పగలు 12 గంటలకు కోర్టులో నేమండల సభ జరిగినది. అధ్యక్షులుగా ఎన్నుకొనబడిన మోహనలాలుగారు హాపూరునుండి మీరటుకు వచ్చుచుండగా దారిలో ఖరఖోడాలో అరెస్టుచేసి వదలివేసిరి. అతడు సకాలమునకు మీరటు వచ్చి అధ్యక్షత వహించెను. నిగుళ్లను ప్రయోగించగా చాలమంది కోర్టులో సమావేశమైరి తీర్మానములనచ్చువేయించి తెచ్చి వేలకొలది అందరికిని పంచిపెట్టిరి. అంతట పోలీసువారు వచ్చి మోహనలాలు, ప్రభుదయాలు, జితేంద్రవీరు హరిశ్చంద్ర బి. ఏ. (కాశీ హిందూ విశ్వవిద్యాలయము) గార్లను మరి పెక్కుమందిని అరెస్టుచేసిరి. అటుపిమ్మట సన్మాన సభాధ్యక్షురాలగు శ్రీమతి విద్యావతి (అడ్వకేటు బి. జ్యోతిప్రసాదు గారిభార్య) గారిని ఆమెయింటివద్ద అరెస్టుచేసిరి. ఈమె కుమారులలో నొకడిదివరకే చెరసాలలో నున్నాడు. మరియొకని నేడు యింతకుపూర్వము అరెస్టుచేసిరి. జితేంద్రవీరుగారి తల్లియును తమ్ముడును యిదివరకే చెరసాలలో నున్నారు.

సాయంకాలము ౬ గంటలకు గంటస్తంభము వద్ద మరల సభజరిగినది. ఆరుగురు స్త్రీలును చాలమంది యువకులును వచ్చిరి. వేలకొలది ప్రజలు సమావేశమైరి. ఢిల్లీ కాంగ్రెసు తీర్మానమును దేశభాషలో నచ్చువేయించి అందరికిని పంచి పెట్టిరి. గుంపులలో విసరివేసిరి. కైలాస ప్రకాశ ఎం. ఎస్. సి. గారు ఉపన్యసించుచుండగా ఆయనను మరి ౩౦ మందిని పోలీసువారు అరెస్టుచేసిరి. మొత్తము ౧౧౦మందిని నేడు అరెస్టుచేసిరి. గాని మరల ౩౫ మందిని వదలివేసిరి.

## గంగాధరరావు దేశపాండేగారి అరెస్టు

ఇంటి సోదా

బెల్గాం, జూన్ ౨౧:—

కర్ణాటక కాంగ్రెసు నాయకులును, అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు ప్రస్తుతపు అధ్యక్షులును అగు గంగాధరరావు దేశపాండేగారు ఈ దినము ఉదయము ౧౦౮ సం॥ రెండవఆర్డినెన్సు క్రింద అరెస్టు చేయబడిరి. వారిపుడు హిండలాగా జెయిలులో డెటిన్యూగా నున్నారు. అరెస్టుకుముందు వారియిల్లు సోదా చూడబడెను.

## మోతీలాలు చిత్రమునకు పంజాబు ప్రభుత్వమువారి ఆక్షేపణ

### లాహోరు మునిసిపాలిటీ తీర్మానమును నిరాకరించుట

లాహోరు, జూన్ ౨౫:—

లాహోరు మునిసిపాలిటీవారు ౧౯౩౦ ఫిబ్రవరిలో మోతీలాల్ నెహ్రూగారి వెండు విగ్రహము ను ప్రదర్శించు చిత్రమును పురపాలక భవనమును ప్రతిష్ఠించవలసినదని తీర్మానించియుండిరి. దీనిని పంజాబు ప్రభుత్వము అనుమతి నిరాకరించినది ఇంకొక మునిసిపాలిటీ విషయమున నిట్టి తీర్మానము

ను ప్రభుత్వ మంగీకరింపనందున తిరిగి ఢిల్లీని ప్రభుత్వమునకు కాను శిఫారసు చేయవలెనని డివిజనల్ కమీషనరు తెలియజేసెను.

## ఢిల్లీజయిలులో మృణాల్ కాంతరాయ్ చౌదరీ గారి ఆత్మహత్య

### నిజము ను తెలిసికొనుటకై దరియాప్తుచేయ గోరి శాసనసభ్యులు ప్రభుత్వానుమతిని కోరుట. అనుమతి నిరాకరింపబడుట

కలకత్తా, జూను ౨౩:—

ఢిల్లీ క్యాంపు జేయిలులో మృణాల్ కాంత రాయ్ చౌదరీగారు ఆత్మహత్యచేసికొనిరని గవర్నమెంటు వారు వెల్లడించిరి. ఈ విషయములో సత్యాసత్యముల నరయుటకై ఢిల్లీ శాసనసభ్యులగు కే. సి. నియోగిగారును, హరవిలాస శారదగారును, ఎస్. సి. మిత్రగారును సదరు జెయిలున కేగి సంగతి సందర్భములను దరియాప్తు చేయుటకు అనుజ్ఞనొసంగవలయునని గవర్నమెంటుహోం మెంబరు గారికి తంతివార్త నంపిరి. కానిగవర్నమెంటు వారు అనుమతి నొసంగలేదు. మేజరు డేవిడ్సను గారు సదరు మృణాల్ కాంతరాయి చౌదరీగారి శవమును పరీక్షచేసిరనియు ఆయన ఆత్మహత్య గావించుకొనెనని ధృవపఱచెననియు ఆయన తిరిగి యితరనిర్బంధితులతో బాటు (డిటెన్యూలతో బాటు) నిర్బంధింప బడేయెడల తనశరీరమున కపాయము వాటిల్లునని యెంచి భయపడి ఆత్మహత్య గావించుకొనెననియు ఈవిషయమై సందేహించ నవసరములేదనియు కనుక దరియాప్తు జేయ నవసరము లేదనియు అందువల్ల అనుజ్ఞ నొసంగుట లేదనియు గవర్నమెంటు వారు ప్రత్యుత్తరమొసంగిరి.

# పల్లెటూరి ప్రజల నివేదనము

## తీదేడు పురుషు వెంకటంపేట

తా॥ దేవరకొండ

(ఒక విలేఖరి)

### శ్రీరామ లింగేశ్వర గ్రంథాలయ దుస్థితి కారణములు

తీదేడు పురుషు వెంకటంపేట అమర్దాదు ౧౭ —

ఈ గ్రంథాలయో పాధ్యక్షులు, గ్రామమునకు పోలీసు పటేలగు, పులుపాల చిన్న పుల్లారెడ్డిగారు గ్రంథాలయము స్థాపించి దాని సంబంధమైన పనులలోనే నిమగ్నులై యుండిన బాగుగనే యుండెను కాని యేమో పంచాయితీ కోర్టని యు, అర్జీలనియు, ఫైసలాలనియు, జూరుమానలనియు మొదలిడిరట అట్టి ఫైసలాలుకూడ న్యాయము పరిశీలించి చేసిన కొంతవరకు బాగుగనే యుండును కాని పక్షపాతబుద్ధి గలవారై తమ స్వంతలాభమును చూచుకొని తమ యిష్టమువచ్చిన వారి జయమునకై పాటుపడుచు యెన్నియో ప్రయత్నములు చేయువారట ఒక్కరు మరుద్దేశము కలవారైన మిగిలినవారు దానిని నిరాకరించరా' యని నొకప్రశ్న కావచ్చును. కాని యెవరికి అంత సాహసము? యెవరో వొకరు వరచి సాహసించిరేని అప్పుడు యేమనవున్నను ఏ రెండుమూడు రోజులలోగాని యెదో యొకి మాయవలనుబన్ని, వారిని నెన్నియోచిక్కుల పాలుజేసి వారిని తమ స్వాధీనము చేసుకొనువారట మొదలే ముక్కిడి ఆపైలో పడిసమున్నట్లు అతడు మొదలే పక్షపాతి అందులో ధనాధికారియగు గ్రామాధికారి కావున వారెట్లు చేసినను తప్పక చెల్లియే తీరవలసి నచ్చును. మన నైజాము రాజ్యమందు యెన్నియో గ్రంథాలయములుండియున్నవి కానియెచ్చటనైనయీవిధము గాపంచాయితి కోర్టులు పెట్టి ప్రజల హింసించి యుండిరని తెలియలేదు యిట్టి జూరుమానలను విధించుట స్వోదర పోషణార్థమే కాని గ్రంథాలయమును వృద్ధికి తెచ్చుట కాదు, యిట్లు చేయుటవల్ల రైతులలో అంతః కలహములు గల్గి యెవరి స్వాధీనములో ఉన్నడబ్బు వారే వశపరచుకొని గ్రంథాలయమును హీనస్థితి పాలుచేసి తమ ముఖ్యోద్దేశమును నెరవేర్చుకొనిరి

### ఈయూరిగృహ పాఠశాల

ఇచ్చట దయామయులగు సర్కారువారు సుమారు (౧౨) వత్సరములనుండి యొక పాఠశాల నేర్పరచి ముఖ్యముగా బీదజనులకు విద్యాప్రసాద మొసగుచుండ దానిని చూచి పోలీసు పటేలగు పులుపాల చిన పుల్లారెడ్డిగారు యే విధముగానైన ఆ పాఠశాల నెత్తివేసిన బాగుండునని యెన్నియో ప్రయత్నములు చేసిరి అతడుకూడ విద్యావంతుడే కావున యేమాత్రమో యిప్పుడొక గొప్ప కార్యభారము వహించి తల పైధరించి యున్నాడు అదేమన తాను యింటియందు గృహ పాఠశాల నేర్పరచి చాలమంది రైతులతో తమతమ పిల్లల గృహపాఠశాలకు పంపుటకు వారితో సంతకపత్రములు తీసుకొని యుండెనట. ఎన్నియో దినములనుండి యుచితముగా విద్యగరపించు బీదరైతులకిప్పుడు డబ్బియవలసి వచ్చినవ యెంతకష్టమో పాఠకులే యూహించగలరు కాని వారేమి చేయగలరు. ఈడబ్బు చూచుకొని పటేలుగారి మాటల నిరాకరించినయెడల అంతకు పదిరెట్లుడబ్బు ఖర్చగుటయే కాక తుదకు గ్రామములో నుండుటకూడ మస్తరమని దృఢనమ్మకము పటేలుగారి ముఖ్యోద్దేశ మేమన బాలకులందరు గృహ పాఠశాలకువచ్చిన సర్కారి పాఠశాలను తీసివేయుదురనియే ఆటుతర్వాత బీదరైతులు జీతములు భరింపలేక పాఠశాలను వదలుదురు. అట్లు వదలిన విద్యాభివృద్ధి తగ్గును. గ్రామములో విద్యావంతులులేకున్న తమ స్వేష్ట పరిపాలనము నిరాటంకముగ జరుగునని యూహించుచుండెను. కాని భగవంతుని దయవల్ల బీదరైతుల యదృష్టము యేవిధముగా పరిణమిల్లవలసి యున్నదో తెలియజాలకున్నది. ఇట్టి సంగతి చూచి సదరు ముదరిసు సా॥గారు కూడ గృహపాఠశాలను తీయించుటకై అలీ జనాబు మొహతెమీం సా॥ గారికి విన్నపమంపిరట. అద్భుతకష్ట అమ్మకూడ అన్నము పెట్టదన్నట్లు కొందరు బీదరైతులు కూడ కలసి అలీజనాబు మొహతెమీం సా॥ తాలీమేతాలీమాత్ గార్కి ఒక అర్జీని పంపియున్నారు దీనిపయిన యిప్ప టికరకును యేమియుఫలితము తేటపడలేదు, ఇక యింతైనను దయామయులగు సర్కారువారు యిట్టి బీదరైతుల కష్టములను బాపి గట్టెక్కించెదరని ప్రార్థించుచున్నాము

---

## గ్రామస్థుల దురవస్థలు

### (౧) సిరునపల్లి

ఆంధ్ర జనకేంద్ర సంఘ కార్యదర్శిగారికి —

అయ్యా!

కరీంనగరము జిల్లా హుజూరాబాదు తాలూకా సిరునపల్లి నివాసులమును దిగువ అంగుష్ఠము చేసి యున్నవారము మాదిగ కులస్థులమును ఆగుమాకు ఎలకలు, వెట్టిచాకిరి విషయమున కలుగుచున్న కష్టము లగూర్చి గ్రహించి సర్కారువారి తరఫునుంచి తగు ఏర్పాటులు చేయించగోరుచున్నాము చిత్తగించ కర్తలు ఇట్లు విన్నవించు విధేయులు.

ఆకునూరి అయిలు
సునిక యీరాదు
తునికి రాజమ్మ
ఆకునూరి కొమురెడు

---

### (౨) తుమ్మెనపల్లి

కేంద్రసంఘ కార్యదర్శి గారికి —

అయ్యా!

తుమ్మెనపల్లి గ్రామస్థులము మాదిగ కులమువారమగు మేము వెట్టిచాకిరి విషయములో మాకు కలుగుచున్న కష్టములను గూర్చి ప్రభుత్వము వారినుంచి తగిన ఏర్పాటులు చేయించ గోరుచున్నాము

విధేయులు,
మిడిదొడ్డి వీరడు,
,, యిద్దిగాడు,
,, ఎల్లడు,
,, ఎర్రఎల్లడు
చిన్నరాజిగాడు,
లసుమడు

---

పై యుత్తరములు మా కార్యస్థానమునకు వచ్చినవి గ్రామములలో మాలమాదిగలు వెట్టిచాకిరి విషయములో చాల కష్టముల పాలగుచున్నట్లు తెలియ వచ్చుచున్నది శ్రీయుత పిసరి వీరన్న పంతులుగారు వీరి విషయమున సానుభూతి చూపుచు మంచికృషి చేయుచున్నారు

యథార్థ మేమన గా, ప్రభుత్వమువారు వెట్టి చాకిరి విషయమున చేసిన నియమములు చాల బాగుగా నున్నవి కాని కొద్ది ఉద్యోగస్థులు నిరుపేదలగు ఆదిహిందూ సోదరులకు ప్రభుత్వమువారి నియమముల ప్రకారము డబ్బు యియ్యక ... ప్పుల పెట్టుచున్నట్లు పలుతావులనుండి తెలియుచున్నది సిరునపల్లి, తుమ్మెన పల్లిలోని సోదరులు తమ కష్టములను ప్రభుత్వమువారికి దరఖాస్తు ద్వారా మనవి చేసికొనుట అవసరము మాల్గుజారీకి పోలీసుకు ఇప్పుడు ... కన్నులు ... చెంచు చౌరగారు యథార్థ్రి ... వారి దయవల్ల వెట్టిచాకిరివారి మీద అచ్చటచ్చట జరుగుచున్న జొన్నైనము తగ్గిపోగలదు కేంద్రసంఘము ఈ విషయమున శక్తికొలది తోడ్పడగలదు. ఆదిహిందువులు అసలే బీదలు కనుక వారు తమ విజ్ఞాపనలను టపాద్వారా పంపుకొనుట చాలను స్వయముగా నగరమునకు రావలెను ఈ కష్టపు దినములలో వృథా వ్యయముల పాలు కావలసి వచ్చునని మనవి చేయుచున్నాము

కేంద్రసంఘ కార్యదర్శులు.

---

## జీడికల్లు

### అతివర్షము

(విలేఖరి)

జ్యేష్ఠ బ॥ ౨ సోమవార రాత్రి సుమారు యేనిమిది పది అంగుళముల వర్షము హఠాత్తుగా పడుటచే జన్గాం తాలూక (నల్లగొండ) లో జేరిన జీడికల్లు శిరిపురం కల్లెము, గుడుపెళ్లి, కొంపల్లి,కొత్తపల్లి, వనపర్తి, రాంరాజుపల్లె, పింగరాజుపల్లె, నిర్మల, మున్నగు గ్రామముల చెరువులు కుంటలు గండ్లుపడి నీరంతయు సముద్రములో జేరినాది ప్రవాహము వలన బావులు పూడినవని గోడపెట్టువారు కొందరు తటాకములు భిన్నమాయనని తల్లడిల్లువా రందరు పశువుల మేతలేవని బాధపడువారు కొందరు అప్పులు పుట్టవని గుంగువారందరు ఈ తాబీకిస్తు రకములు చెల్లించు మార్గములు లేవనువారు కొందరు ఈ విధముగా వివిధ విషయములగూర్చి పరితపించుచున్నారు ఈవాన రైతులకు దుఃఖ వర్షము, గ్రామోద్యోగులకు జుర్మాన వర్షము, గుత్తేదార్లకు సువర్ణ వర్షముగా మారెను

---

## ఆసఫాబాద

( స్వకీయ విలేఖరి )

### సుడిగాలి

ఆసఫాబాద అమర్దాదు ౧౨:—

సుడిగాలి వలన ఆసఫాబాద గ్రామమందలి కోలిపాకి జగ్గన్న, సిద్ధాంపైకెన్న, నిమ్మకంటి రాజయ్యగార్ల, యిండ్లపై గప్పబడియున్న ఇనుపరేకులు పైకెగిరి దూరముగా బడెను కాని ప్రాణాపాయము లేమి గలుగలేదు.

### వర్షము కురిసినను అమిత వేడిమి

మృగశిర ప్రవేశించి రెండుమూడు వర్షములు కురిసినవి కాని ఉష్ణము తగ్గనందున జనులకు చాల కష్టతరముగా నున్నది

### నాయబు నాజిం సాహెబు పోలీసు

నాయబు నాజిం సాహెబు పోలీసు ఇక్కడికి వచ్చియున్నారు పోలీసు కచ్చేరీల తనఖీ చేయుచున్నారు

---

## సికింద్రాబాదు

### వికట కవిత్వ ప్రదర్శనము

సికింద్రాబాదు జూన్ ౨౨:—

శుక్రవారము సికింద్రాబాదు కెంట్రిడ్ హాలులో మైసూరు సంస్థాన విదూషకులు శ్రీమాన్ వికటకవి రత్న సుబ్బయ్యగారు హాస్యరస ప్రదర్శనము గావించిరి స్థలము క్రిక్కిరియునట్లు ప్రేక్షకుల ఆగమనము మిక్కిలి శోభాయమానమై యున్నది శ్రీ కవిగారు, విద్యవలన ఏ మార్గమును మోక్షమార్గమును సంపాదింప గలుగుదుమని యు, సభలో విదూషకపాత్ర మిక్కిలి క్లిష్టమైనదనియు, అవినీతి మార్గములను వివర్జించి నీతిమార్గమందు యెవరు కూర్చుటకు విదూషకపాత్ర మిక్కిలి యావశ్యకతయనియు నుడివిరి పిమ్మట వారు ప్రదర్శించిన ముఖ్య హాస్యరస జాతీయములలో.

౧ పంచాంగ ఫలశ్రవణము ౨. పండితుల వాక్యార్థం ౩ యాత్ర (సంధ్యావందనము) ౪. వైశ్య ప్రహసనము (లంభాగ్రేసర చక్రవర్తి) ౫ బుడబుడకలవాడు ౬. వారాంగనాగానము ౭ సంగీతము (వీణానాదము, మృదంగనాదము పిడేలునాదము) ౮ రైలుప్రయాణము ౯ జంతువులయొక్కయు పక్షులయొక్కయు, శబ్దములను మిక్కిలి శ్రావ్యముగాను, అత్యద్భుతముగాను ప్రదర్శించిరి శ్రీవారు మధ్యమధ్య అప్రకటముతైన వికటకవిత్వ పద్య గద్యములు వినవీనులు తనివిదీర ప్రేక్షకులు సంతోషమున నుండిరి.

### నాట్యాలంకారము

శ్రీ మైలవరం బాలభారతీ సమాజం (బెజవాడ) వారు సికింద్రాబాదులో యింతవరకు రెండు నాటకములు ప్రదర్శించిరి ౧. సావిత్రి ౨ ద్రౌపదీ వస్త్రాపహరణము యీ సమాజమువారు, శ్రీ మైలవరం జమీందారుగారి పోషణమున, నాట్యకళయందు మిక్కిలి కృషిసల్పి, ఆంధ్రావనికి వన్నెదెచ్చియుండిరి. గాని యీమధ్యలో కారణాంతరముల చేత యీ సంఘములోని నటులు స్వార్థత్యాగులై కొందరు ...

ముసుండి చీలిపోయినను లరిగి యీ సంఘమువారు ప్రధాన నటులు, శ్రీయుతులు యడవల్లి సూర్యనారాయణరావుగారు, ఉప్పలూరి సంజీవరావుగారు యీ సంఘము నుండి వీడిక యుండుట మిక్కిలి అదృష్టప్రాప్తము నటులు, ధనాపేక్ష చేతనేమి మరియింక కారణములచేమి యితర సమాజముల లోనికి (కిరాయి నటకులవలె) అటునిటు దుగాడక స్వ సమాజము కనిపెట్టుకొనియుండిన యెడ అనుభవములను ననుసరించి ప్రదర్శనములకు యింపుగ లేకపోవునో, నాట్యకళ మిక్కిలిగా పోషింపబడుననుట నిస్సందేహము. యీ నాటకముల లో ముఖ్యనటులు శ్రీ సూర్యనారాయణరావుగారు సంజీవ రావుగారు, మొదలగువారి నటనాకౌశల్యము ఎల్లరకు తెలిసి యుండుటచే వర్ణింప నవసరముగాని, యితర నటకుల లో స్వల్పలోపములు గలుగకపోవు వాటి యుపశమింప జేసికొని నటులు నాటకముల ప్రదర్శించుదో నాట్యకళను పోషింపగలరు. యింకను యీ సమాజమువారు ,,చిత్రనళీయము—గలంగూన్ శాడీ'' అను నాటకములను ప్రదర్శించెదరని తెలియ వచ్చుచున్నది

ది. డెక్కన్ మానవ సేవాసమితి (సికింద్రాబాదు) వారు సుమారు నెలక్రిందట నూతన కార్యనిర్వాహక వర్గ మేర్పడి, రాబోవు ఆషాడ పూజా సందర్భములో పశుబలి నిరోధన ప్రచారము మిక్కిలి యుత్సాహముతో కొనసాగింప ప్రయత్నములు సలుపుచున్నారు ప్రస్తుతము శ్రీమాన్ కె తాతాచార్యగారు సమితి అధ్యక్షులుగా నుండుటచే యీ సమితి కార్య నిర్వహణము యిదివరకంటె ద్విగుణీ కృతమై నెరవేరగలదని నమ్ముచున్నారు

---

## కీ. శే. మనసారాముగారు

(విలేఖరి)

హైదరాబాదు నగరములోని ఇసామియా బజారునందు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవాలయమున గత శుక్రవారమునాడు సాయంత్రము ౬॥ గంటలవేళ కీర్తిశేషుని మరణమును గూర్చి దుఃఖమును ప్రకటించుటకై సభ సమావేశమయ్యెను సుమారు ౨౦౦ మంది వచ్చియుండిరి. ఆరంభమున శ్రీయుత బొజ్జము నరసింహులుగారి యుపపాదనమును, మరియొక సభాసదుని యామోదమును జరిగిన మీదట సభకు మా. హనుమంతరావు గారగ్రాసనాధిపులుగా నెన్నుకొనబడిరి అధ్యక్షుని ప్రారంభోపన్యాసమున కీర్తిశేషుని పరోపకార బుద్ధిని, ధర్మాచరణమును ఆంధ్రభాషాభిమానమును ప్రశంసింపబడెను. తరువాత నిక్రింది తీర్మానము శ్రీయుత రాజరత్నాచారిగారి వలన ప్రతిపాదింపబడి శ్రీయుతులు భాగ్యారెడ్డి, అమృతలాలుగార్ల వలన కీర్తిశేషుల జీవిత విశేషములతో ఆమోదింపబడెను అనంతరము సభాసదులందరు గౌరవ పురస్సరముగా లేచి నిలువబడి తీర్మానము నంగీకరించిరి శ్రీ భాగ్యరెడ్డిగారు కీర్తిశేషుని సేవలను బొగడిరి శ్రీ రాజరత్నాచారిగారు ఆర్యసమాజ విషయములో కీర్తిశేషు డొనర్చిన దాన ధర్మముల వివరించిరి

,,సుప్రసిద్ధ విద్యాప్రియులును పరోపకార పారీణులునునగు దానవీర మనసారాంగారి ఆకస్మిక మృత్యువునకు ఈసభవారు అత్యంత శోకమును ప్రకటించుచు వారి ఆత్మకు శాంతిని, వారి కుటుంబమునకు ధైర్యమును ప్రసాదింప భగవంతుని ప్రార్థించుచున్నారు''

తరువాత రెండవ తీర్మానము నీక్రింది విధముగ శ్రీయుత వడ్లకొండ నరసింహారావుగారి వలన ప్రతిపాదింపబడి శ్రీ బొజ్జము నరసింహులుగారి వలన ఆమోదింపబడెను విద్యార్థి మానియును, కీర్తిశేషుని స్మారక చిహ్నము విద్యావిషయికమగు విద్యార్థి వేతనముగా —ముఖ్యముగా విద్యార్థి వేతనముగా— నుండుట వాంఛిదని శ్రీరావుగారు సూచించిం

కీర్తిశేషులైన మనసారాముగారి స్మారక చిహ్నము శాశ్వతముగ నుండునట్లు స్థాపించుటకై ఈసభవారు దేశీయులను —ముఖ్యముగా కల్వారీ మాడలిని—, ప్రార్థించుచు ఈ కార్యమునకై ఈక్రింది సభ్యులుగల యొక కమిటీని ఏర్పరచుచున్నారు —

(౧) నారాయణలాలుగారు

(౨) ఆరుగొండ లక్ష్మయ్యగారు

(౩) వడ్లకొండ నరసింహారావుగారు

పిమ్మట రాత్రి ౯॥ గంటలకు సభ ముగిసెను

---

## కుక్కునూరు

శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయ పునరుద్ధరణకై సుప్రసిద్ధ ఆంధ్రకవయిత్రి శ్రీమతి చాట్రాతి లక్ష్మీనరసమాంబగారి గ్రంథ వితరణము

రామకుమారనము (చిక్కని ప్రబంధము) వెల రు ౧-౦-౦
శ్రీకృష్ణుని దేశసేవ (గద్య పద్యాత్మకము) ,, ౧-౦-౦
ఝాంసీ లక్ష్మీబాయి (చారిత్రాత్మక పద్యకావ్యము ౦-౧౦-౦

మాధుర్యమగు శైలి భావ గంభీర యుక్తమగు వర్ణనాంశములు అనర్గళమగు కవితాధార సుస్ఫూర్తి గలిగి ప్రాచీన కవయిత్రీ మణుల జట్టికి దెచ్చు నగ్రంథములు శతావధాని బ్రహ్మశ్రీ వెల్లపిల్ల వెంకట శాస్త్రిగారు ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు ప్రొఫెసర్ రాయప్రోలు సుబ్బారావుగారు నైజాం కాలేజి ప్రొఫెసరు రాయప్రోలు వెంకట్రామ సోమయాజులుగారు ప్రొఫెసరు శివగూరి హనుమంతరావు ఎం ఏ గారు హైకోర్టు వకీలు మాడపాటి హనుమంతరావుగారు మున్నగు సుప్రసిద్ధుల యొక్కయు పత్రికల యొక్కయు ప్రశంసాభిప్రాయములతో బాగస్తకెక్కియుండుటచే ఈగ్రంథ ప్రాశస్త్యము వేరుగ వెల్లడిచేయ నక్కరలేదు ఇట్టి గ్రంథము లెల్లరకు పఠనార్హములు విధాయకములు. ఈగ్రంథములను విక్రయింపగా వచ్చిన సొమ్మును ఇటీవల పరశురామ ప్రాయమైన కుకునూరు దగ్గర గ్రంథాలయ పునరుద్ధరణమునకై వినియోగింపబడును గ్రంథకర్త్రిణిగారు చూపిన యౌదార్యమునకుతోడు ప్రతియాంధ్రుడును యీ గ్రంథములను తెప్పించుకొనినచో భాషాభిరుచిని పెంపొందించుటకే గాక ఈ గ్రంథాలయ పునః ప్రయత్నములకు తోడ్పడిన వారగుదురు కొలది ప్రతులే మిగిలియున్నవి కావలసినవారు యీక్రింది విలాసములకు వ్రాసిన వి. పి. గా పంపబడును

బ్రిటిష్ పోష్టు — కో వెం. రా. ల. నా. శర్మ కార్యదర్శి, కుకునూరు. కూనవరంపోష్టు, తూర్పు గోదావరి

నైజాం పోష్టు — కో రామకృష్ణారావు టీచరు, బూర్గంపాడు పోష్టు, డోర్నకల్ మార్గము వరంగల్ జిల్లా

### శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయము కుకునూరు

ఈక్రింది ప్రముఖులు దయతో తమ గ్రంథసహాయ మొసగినందులకు కృతజ్ఞులము.

| | | | |
|---|---|---|---|
| ౧ | | శ్రీమతి చాట్రాతి లక్ష్మీనరసమాంబగారు | ౩ |
| ౨ | | శ్రీయుత రాయసం వెంకటశివుడు పంతులు ఎం ఏ. యల్ టి గారు | ౮ |
| ౩ | ,, | పళ్లెపూర్ల ప్రజాచార్యులుగారు | ౨ |
| ౪. | ,, | కోలచలము కృష్ణ సోమయాజులుగారు | ౧ |
| ౫. | , | నేమల సూర్యనారాయణ శాస్త్రిగారు | ౪ |
| ౬. | ,, | పండిత పెనుమత్స సత్యనారాయణ రాజుగారు | ౭ |
| ౭ | , | పండిత ఆదిరాజు వీరభద్రరావుగారు | ౨౭ |
| ౮ | , | పల్లాని సూర్యనారాయణ రావుగారు బి ఏ బి యల్ | ౩ |
| ౯. | | వేలూరి రామకృష్ణారావుగారు ఏలూరు | ౧౨ |
| ౧౦ | | భారతి గ్రంథమాల | ౧ |
| ౧౧ | , | కో వెం రా ల. నా శర్మగారు | ౩ |
| ౧౨. | ,, | రాయప్రోలు వెంకట్రామ సోమయాజులుగారు | ౧ |
| ౧౩. | ,, | శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల | ౧ |
| ౧౪ | ,, | గుండు నరహరిగారు బి ఏ, బి ఎల్ | ౮ |
| ౧౫ | , | కొత్త భావయ్య చౌదరిగారు | ౨ |
| | | మొత్తము | ౮౩ |

ఇప్పటికి గ్రంథాలయమునకు నుచితముగా నొసంగబడిన గ్రంథముల మొత్తం ౮౭౭,

ప్రొఫెసరు రాయప్రోలు వెంకట్రామ సోమయాజులుగారు రు ౧-౦-౦ విరాళము మ. రా. శ్రీ చెన్నం వీరయ్యగారు ౨-౦-౦ వకీలు విద్యాకట్నము నొసంగిరి. ఎల్లరు గ్రంథ సహాయమును జేయ ప్రార్థితులు, బ్రిటిష్ పోష్టు సౌకర్యములేని నిజాం రాష్ట్రవాసులు కో రామకృష్ణారావుగారు టీచరు బూర్గంపాడు వైయా డోర్నకల్ వరంగల్ జిల్లా అను విలాసమును గమనింప కోరెదను.

---

## కన్సర్వేటివు యిండియా కమిటీ సమావేశము

### లోథియను కమిటీ సూచనలను నిరసించుట

లండను, జూన్ ౨౧—

నేడు రాత్రి కన్సర్వేటివు యిండియా కమిటీవారి సమావేశము జరిగినది ఆసభలో వింటర్టను ప్రభువు, మేజరు కెడోగను, క్యాంబెలు కెరుగార్లు ప్రాంఛైజు కమిటీ నివేదికను గూర్చి మాటలాడిరి

,,నూతన రాజ్యాంగ సంస్కరణములను కొనసాగించుటకు ధనవ్యయము చాల అధికమగునని వీరు ముగ్గురును గూడ తెలిపిరి ఇంతకు పూర్వము సభలో యీ విషయమును గూర్చియే ప్రాంఛైజు సంఘ సభ్యులిరువురు మాటలాడిరి.

### బ్రిటను మంత్రివర్గమున లోథియను ప్రభువును నియమించెదరా?

మంత్రివర్గము వారిలో నొకరగు డొనాల్డు మెక్లీన్సు గారు మృతినొందినటచె ఆ స్థానమున లిబరలు పార్టీ సభ్యునే నియమించునెడల లోథియను ప్రభువుకు ఆపదవి లభింపగలదు కాని కన్సర్వేటివులలో తీవ్రవాదు లందులకు సమ్మతించుటలేదు కింగుస్లేవుడు మేజరు ఎలియటుగార్లు నియమింపబడవలెనని వారు పట్టు పట్టుచున్నారు ఎలియటుగారు ట్రెజరీకి ఫైనాన్సలు సెక్రటరీగానుండి చాల ప్రశంసనీయముగా పనిచేసెనని మూడు పార్టీలవారును గూడ నంగీకరించియే యున్నారు

### సంస్థానాధి పతులకు ఫెడరలు శాసన సభలలో స్థానములు

,,ఫెడరలు శాసన సభలలో వేరువేరు సంస్థానములను గూర్చిన సమస్యను సంస్థానాధిపతులు నిర్ణయింపజాలకపోయినచో అనగా యీ విషయమున వారిలో వారికి అంగీకారము కలుగక పోయినచో దీనిని పరిష్కరించుటకు డేవిడ్సను సంఘమువంటి నిష్పాక్షిక సంఘమువారిని కోరి, వారి పరిష్కారమున కంగీకరింపవలెను, రౌండు టేబిలు సంఘమువారి సూచనల ప్రకారము జరుపవలెను ఇదియే సంస్థానాధిపతుల సంఘ సభ్యులకు ప్రతికూలు రగువారి అభిప్రాయము'' అని పరలా రాజాగారు లండను టైమ్సు పత్రికకు వ్రాసిరి.

---

## మాల్టాలో జాతీయ ప్రభుత్వ మేర్పడుట

### సర్ యూగోమిఫుసదుగారు మంత్రివర్గము నేర్పాటు చేయ

మాల్టా, జూను ౨౧—

మాల్టాలో జాతీయ నాయకుడగు యూగోమిఫ్రుసదు గారు మంత్రివర్గము నేర్పరచిరి. ఈమంత్రి వర్గమున మిజ్జీగారు వాణిజ్య పరిశ్రామిక మంత్రిగా నున్నారు.

,,మాల్టాను యిటలీతో చేర్చుటకు మేమెంతమాత్రమును సమ్మతింపము బ్రిటిషు సామ్రాజ్యమునందు మాల్టాదేశమొక స్వపరిపాలిత దేశముగా నుండవలెను బ్రిటిషు సార్వభౌమునిపట్ల రాజభక్తిని కలిగి యుండవలెను. అనగా దక్షిణ రోడీషియా మున్నగు దేశములవలెనే స్వపరిపాలనమును కలిగియుండవలెను అను షరతుపైననే యీసమస్య జరిగిన శాసన సభల ఎన్నికలలో మా పార్టీవారు నెగ్గిరి'' అని సర్ యూగోగారు తెలిపిరి

(రాయిటరు)

---

## ఒకస్త్రీ తనభర్తను హత్యగావించుట

### భార్య నడవడికను భర్త అనుమానించుట యొక్క ఫలితము

లాహోరు, జూన్ ౨౨:—

ఈ రోజున ఫస్టుక్లాసు మేజిస్ట్రేటుగారి యెదుట బడోకి వాస్తవ్యురాలగు మునమ్మతు యిండో అను నొక స్త్రీ తన భర్తను హత్యగావించెనని కేసు చేయబడెను ,,ఆమె నడతను ఆమెభర్త అనుమానించెను అందులకు ఆమె తన భర్తను చాలపర్యాయములు చంపెదనని భయము పెట్టుచుండెను. తుదకు భర్త నిద్రించుచుండగా అతని మెడను నొక్కిచంపెను. అని తెలుపబడెను. ఆమె క్రిస్టియను వీధులను తుడుచు పనిచేయును.

## కొరడా కొనలు

### ద్రౌపది

(జరిఘాలుడు)

నేను మొన్న గురువారం బాలభారతీ సమాజము (మైలవరం) వారిచే ప్రదర్శింపబడ్డ "ద్రౌపదీ వస్త్రాపహరణమనే నాటకానికి వెళ్లడం సటస్సించింది. నటకులంతా ఆంధ్ర నాటక రంగములో చిరకాలమునుంచి పేరు మోసినవారు. కాబట్టి నా అభిప్రాయాలను జనసామాన్యం లెక్క చేయదనే విషయం నాకు తెలుసును. కాని నా అభిప్రాయాలతో ఏకొంతమంది నాటకకళాభిమానులైనా ఏకీభవిస్తారనే నమ్మకంవుంది ఏకీభవించకపోయినా యేమంత బాధలేదు నా అభిప్రాయములను తెలియపరచడం నావిధి. నావిధిని నేను నిర్వహిస్తా.

నటకునికి ఉండవలసిన లక్షణాలల్లో ముఖ్యమైనది తాను ధరించగల పాత్ర తనకు స్వభావసిద్ధముగా వున్నదో లేదో చూచుకొనుట. అయితే ఎట్లయినా తనకు స్త్రీపాత్ర ధరించడంలో చాలా కాలంనుంచి ప్రసిద్ధి దొరికిందిగదా అని వయసు చెల్లినా, ముఖం ముడతలుపడ్డా శరీరంలో వాతం బలించినా ద్రౌపదిపాత్ర ధరించి నగరంలో ప్రవేశించడం మాత్రం మన సంజీవరావువంటి నటకుని కేమాత్రం భావ్యంగాదు. సంజీవరావుగారు ధరించిన ఆ ద్రౌపదిపాత్ర ఏమాత్రం పెండ్లివున్న మనిషిగూడా స్వభావసిద్ధంగా అనిపించదు. ద్రౌపదిని సభలోని కీడ్చించి తెచ్చిన తరువాత సుయోధనుడు "రమ్మా నా తొడపై కూర్చొను" మని తొడసైగ చేస్తూ చూపిస్తూన్నప్పుడు "ఇంత వయసు గడచిన ఈ సుయోధనుని కెంత పైత్యం వుందో" అని అనిపించింది. మొత్తంమీద ఈనాటకాన్నంతా చూచిన తరువాత నేను మన సంజీవరావుగారికి వయసుచెల్లిన ఏకవస్త్రధారిణియగు స్త్రీపాత్ర చాలా బాగుంటుందని కనిపెట్టగలిగా ఇంతటితోనయినా వీరు యౌవనవతులయిన రమణీలలామల పాత్రల ధరించుట వదలివేస్తే నాటకరంగానికి చాలా మేలుచేసినవారవుతారు.

శ్రీకృష్ణుడై రంగమునకు వేంచేసిన మన పారుపల్లి మహాశయుడు వచ్చేరావడంతోనే బ్రహ్మాండంగా తనకున్న సంగీత జ్ఞానాన్ని కుమ్మరించడం మొదలుపెట్టాడు. వీరు భావప్రదర్శన మే జంతువుప్పరో కలనైనా యెరుగరు. వీరు సంగీత మునకర్హులయితే కావచ్చుకాని నాటకానికిమాత్రం అర్హులు కాకపోగా వేసవురుగువంటివారు తమ అనవసర భాగాలొన పాలివేసి భావప్రదర్శనం నేర్చుకుంటే కొన్నాళ్లకయినా నటకుడయితే కావచ్చు. యుధిష్ఠిరుడి పాత్ర ధరించిన శాస్త్రిగారికి ఆంధ్రసారస్వత విషయంలో ఏం తెలుసునోగాని నాటకం అంటే ఏమిటో తెలిసిన పాపానపోలేదు. ఊ అంటే రాగమే. ఈరాగాలావేశవరుసగా నటకులందరిలో చాలామంది కుండే రోగమేకాని వీరికి మరీయెక్కువ. కాబట్టి వీరిది భావించడం సర్వవిధముల శ్రేయస్కరము.

దుశ్శాసన పాత్రధారియు, శిశుపాల పాత్రధారియునైన మన గ్రామఫోనిస్టుగారు బాగా అభినయింప గలిగారు. గాని వీరికిగూడ పైవ్యాధి బాగా ముదరింది.

భీమ పాత్రధారియు, విదుర పాత్రధారియు తమ పాత్రల చాలావరకు బాగానే నిర్వహింప గలిగారు. సూర్యనారాయణగారుమాత్రం ప్రశంసార్హుడైన నటకుడు. మిగిలిన విషయాలేమైనావుంటే ముందు చూద్దాం. ఇప్పటికిది చాలు.

ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః

## బాలబాలికా సమాజము

19_6-32 ఆదివారమున రెడ్డిహాస్టలు భవనమున ప్రదర్శించిన "వరవిక్రయ నాటకము" నకు సంబంధించిన ఆదాయవ్యయముల పత్రికాముఖమున ప్రకటించుచున్నాము.

౯౫—౧౨—౦ జమ రూపాయిలు

| | | | |
|---|---|---|---|
| ౬౯ | ౧౨ | ౦ | టికెట్లు అమ్మకం |
| ౨౦ | ౦ | ౦ | రా. కోట్యాలుగారిచ్చినవి |
| ౬ | ౦ | ౦ | రావలసిన్న బాకీలు |
| ౯౫ | ౧౨ | ౦ | మొత్తము |

౭౯—౪—౦ ఖర్చురూపాయిలు

బహుమానములు.

| | | | |
|---|---|---|---|
| ౧౦ | ౨ | ౦ | పుస్తకములు |
| ౧ | ౧౨ | ౦ | సూటు కేసులు |
| ౩ | ౦ | ౦ | పుష్పములు |
| ౧ | ౮ | ౦ | బండిచార్జి |
| | ౧౨ | ౦ | బండిచార్జి |
| ౨ | ౦ | ౦ | మోటారు |
| ౦ | ౮ | ౦ | తెరలు కిరాయి బండికి కూలి |
| ౦ | ౪ | ౦ | తెరలు కిరాయి బండికి కూలి |
| ౦ | ౧౨ | ౦ | తెరలు కిరాయి బండికి కూలి |
| ౨ | ౦ | ౦ | రంగులు |
| ౪ | ౦ | ౦ | తబల & రంగువేసినవాడు |
| ౫ | ౦ | ౦ | సంగీత వగైరా |
| ౪ | ౦ | ౦ | అచ్చుపనులు |
| ౩ | ౦ | ౦ | పనివాండ్లు కూలిచేసినవి |
| ౨౨ | ౮ | ౦ | పతకములు |
| ౪ | ౦ | ౦ | ఫోటోకొరకు |
| ౮ | ౦ | ౦ | చిల్లరఖర్చులు |
| ౭౯ | ౪ | ౦ | |

౧౬ ౮ ౦ నిలువ.

మిగిలిన ౧౬ ౮ ౦ రూప్యములు సమాజము ఫండు క్రింద నిలువబెట్టడమైనది.

పండటి వీరరాఘవమ్మ
కార్యదర్శిని

## శ్రీయుత బాబు రాజేంద్ర ప్రసాదు గారి విడుదల

వారి అస్వస్థత

పాట్నా, జూన్ ౨౮:—

బీహారు కాంగ్రెసునాయకులగు శ్రీయుత బాబు రాజేంద్రప్రసాదుగారును, కృష్ణవల్లభసాహే, (హజారుబాగు) రాంభరోసెబ్రహ్మచారి, రాజేశ్వరప్రసాదు గారలు హజారీబాగ్ సెంట్రల్ జెయిలులో విడుదలచేయబడిరి. నేడు రాత్రి పాట్నాచేరిరి. ప్లాట్‌ఫారముమీద కాంగ్రెస్‌వారి ప్రదర్శన మేమియు లేకుండెను. రాజేంద్రబాబు గారు ఆరోగ్యముగాలేరు. జ్వరముతో బాధపడుచున్నారు.

## హిందువులకును మహమ్మదీయులకు విజ్ఞప్తి

ప్రజలకును పత్రికా సంపాదకులకును జాతీయపక్ష మహమ్మదీయనాయకుల ప్రకటన

మౌలానా అబ్దుల్ కలామ్ ఆజద్ (కలకత్తా) మౌలానా హుస్సేను అహమ్మదు (దేవబంద్) డాక్టరు సయపుద్దీను కిచ్లూ (పంజాబు), మాలక్ బర్కతాలీ (పంజాబు), మౌలానాసజ్జదు (బీహారు) డాక్టరు మహమ్మదు (బీహారు), అనసారీ (ఢిల్లీ), మౌలానా ఆరిఫుహస్వీ (ఢిల్లీ) మౌలానా అబ్దుల్ బారీ ఫారింగిమహల్లో సంయుక్తపరగణాలు, ఖాలిక్ ఉజ్జమాను (సంయుక్త పరగణాలు)—వీరందరును కలసి యీక్రింది రీతిగా నొక విజ్ఞప్తిని పత్రికాసంపాదకులకును భారతీయులగు హిందువులకును మహమ్మదీయులకును ఉద్దేశించి ప్రకటించిరి.

విజ్ఞప్తి

భారతీయు లందరును సుఖులై ఐక్యముగా ఆత్మగౌరవముతో వర్ధిల్లవలెనని ప్రపంచములోని యితరజాతులవారిచ్చే గౌరవింపబడవలెననియు కోరుచున్న సంకల్పములకు సహింపరాని అనర్థకములు కొన్ని దేశములలో యుద్భవించుచున్నవి. అట్టి అనర్థదాయక బీజములకు కొందరు దోహదము జేయుచున్నారు. ఇట్టి యనర్థదాయక బీజములను కలహ కారణములును వర్ధిల్లుట వలన దేశములోని జనులకు అన్యోన్యభావము సన్నగిల్లి ఘోర పోరాటములును అంతః కలహములును పొసగుచున్నవి. హిందూ మహమ్మదీయ సంఘములకు దేశ పరిపాలనయందు ఉండవలసిన స్వాతంత్ర్యాధికార విషయము రాజకీయనాయకులు తర్జనభర్జనజేసి వాద ప్రతివాదములవలన పరిష్కరించవలసి యున్నది. వారిలోవారు సర్వాంగీకార యోగ్యమైన విధానమును నిర్ణయించవలెను. దేశములోని అన్ని సంఘములవారును అన్ని మతములవారును సమాన హక్కు స్వాతంత్ర్యములను కలిగి స్వసంఘ రక్షణార్థమై తగిన అభయహస్తములను పొందవలసియేయున్నారు. కాని యీవిషయములో అభిమాన పక్షపాతములకు అవకాశ ముండరాదు.

ఉభయపక్షముల కోర్కెలను సహజనముగా నేడేర్పుటకై హిందూమహమ్మదీయ సమస్యను పరిష్కరింపవలయు ననితామేము కోరుచున్నాము. కాని యీవిషయములో ఒక రెక్కువయనిగాని ఇంకొకరు తక్కువయనిగాని నిరూపింపట కూడదు. అట్టి తారతమ్య విభేదమువల్ల అయా పక్షాభిమానులు ఆత్మస్తుతి పరనిందలతో కయ్యములకు కాల్దువ్వ నున్నారు. సభామర్యాదల నెరింగి వాద ప్రతివాదములయందు నియమనిగ్రహములను పాటించెడివారు యిట్టి హిందూమహమ్మదీయ సమస్యను చర్చించునపుడు పరుషభాషణములు లేకుండ వ్యవహారములను పరిష్కరింపబూనుకొనగలరు. కాని, ఒకపక్షమువారింకొక పక్షమువారిని గూర్చి హీనవాక్యము అను సర్మగర్భంబుగాపల్కెడి పరిహాసములను పత్రికాసంపాదకులు కొందరు చేకొంచి ఆ దూషణ వాక్యము

నే కొరకొరట్ల కొండంతలుజేసి ప్రజాజన హృదయము నాకర్షించి యుద్రేకింప జేయునట్లుగా ఆయా పత్రికలయందు పెద్దఅక్షరములతో వ్రకటించి తమ పత్రిక సెట్లయినను ప్రసిద్ధిలోనికి దెచ్చుకొనవలయునని యత్నించుచుందురు. ఆ పత్రికలను చదివి గుండెలదిరి కోపావేశులై ప్రతికక్షులపైబడి కలకలాలు చేయుచుందురు. ఇటీవల బొంబాయిలో జరిగిన ఘోరకృత్యములే ఇందులకు సాదృశములు. తమ పత్రికలలో కక్షులను పెంచెడి విషయములకు ప్రాధాన్యమొసంగి పెద్దఅక్షరములతో ముద్రించుటవలన నెంతెంత వంత వాటిల్లుచున్నదో ఆ పత్రికా సంపాదకు లించుకైన గమనించుచుటలేదు అల్లరి చేయవలయునని యుద్వేగపూరితుల దుండగీడు లెపుడును అవకాశముకొరకై అల్లాడుచుందురు. అట్టి దుండగీడుల కివి దివ్యమైన కలహ కారణములు. ఇట్టి దుర్మార్గుల కొట్లాటలకై కల్పించెడి వ్రాతలను పత్రికా సంపాదకులు ప్రకటించుట ఘోరపాపము. అట్టి పత్రికలే ప్రజాశాంతికి వేటువురుగులు ఏదైన నొక యమంగళకర వార్తను కొట్టికాయలంత అక్షరములతో పత్రికా ముఖమున వ్రతంబున తోరణము గట్టినట్లుగా వడి నెత్తిని ముద్రించుటవలన ప్రజల నెక్కువ యుద్రేకింపజేయును. ఆవార్తనే పత్రికలో నొక మూరుమూల చిన్నఅక్షరములతో ముద్రించుటవల్ల ప్రజలనుద్రేకింప జేయజాలదు. కాబట్టిపత్రికలయొక్క ప్రభావము ప్రజాహృదయముపై అమోఘము. అట్టి పత్రికలు ప్రజలకు సదుపదేశముల నొసంగవలసియున్న సందర్భములో ప్రజలకు దురోభ్రలను గావించుచున్న యెడల, అట్టి పత్రికలకు మేము హితోపదేశములను చేయ సాహసింప . కాని, అట్టి పత్రికా సంపాదకులను వినయపూర్వకముగా విన్నవించుకొనుచున్నాము.

రాజకీయ సమస్యలు రాజకీయనాయకులు పరిష్కరించ వలసిన విషయములై యున్నవి. అట్టి రాజకార్యములతో పనిలేని దుండగీడు లెందరికిని ప్రసక్తి యుండరాదు అట్టి దుండగీడులకు రాజకీయ వ్యవహారములందు భిన్నాభిప్రాయములతో పనిలేదు. కాని దేశములో కల్లోలము జరిగినదే తడవుగా దుండగీడులు తమకు తరుణము చిక్కెనని గిల్లికజ్జాలకు వచ్చెదరు. అట్టిదుండగీడులకు చేయుతగా దున్నంకల్పులకు పెద్దలు కొందరున్నారని యితరులు భ్రమించుట కవకాశ మేర్పడును. ఇట్టి భ్రమ ప్రమాదములకు ప్రజలు లోనుగాకుందురు గాక!

ఈ విశాలమైన వ్యాప్త భరతఖండమునందు ఏమూలనైన నొక పట్టణములో నొక వీధిలో కొట్లాట జరుగకయుండుట అసంభవము. కాని, ఈ దేశములో జరుగుచుండిన కొట్లాటలలో తరచుగా హిందువులును మహమ్మదీయులును మాత్రమే కలహించుట చాల విషాదకరము. అట్టి ఘోరకలహములకు కార్యద్విహత్యల గావించిన దుర్మార్గులగు గవర్నమెంటువారు శిక్షింపకుండుటకై మనము వారికి శరణొసంగి కాపాడుట గొప్పదోషము. దుర్మార్గుడైన మహమ్మదీయునకు మరొకమహమ్మదీయు డెవడును అభయహస్తమొసంగి కాపాడగూడదు. దుర్మార్గుడైన హిందువు నెవ్వనినైనను అభిమానించ మరొకహిందువు కాపాడవలెనని యత్నింపగూడదు కొందరు . . . . దుర్మార్గులను జేసినంత మాత్రమున ఆ సంఘమునకు చెందినవారందరును దుర్మార్గులని వాదించుట సహేతుకముకాదు. ఎవరో కొలదివందల హిందువులుగాని మహమ్మదీయులుగాని, ఘాతుకములను జేసిరను కారణమున హిందూసంఘ మంతయుగాని మహమ్మదీయసంఘ మంతయుగాని దురాత్ములతో కూడియున్నదని తలక్కడ చేయుగూడదు. వందలకొలది దుర్మార్గులు కల్పించినప్పటికిని లక్షలకొలది సన్మార్గులు ఆ సంఘముందే కలరని ఎఱుంగవలెను. కాబట్టి ఇట్టి కలహాపాదనమైన యీ హిందూ మహమ్మదీయ సమస్యనుగూర్చి అంతయోక్తులను పలుకక ఉద్రేకము వహింపక శాంతచిత్తముతో నిర్మల భావముతో విషయములను వకటించి ముచ్చటించవలయునని మేము కేలుమోడ్చి ప్రజలను పత్రికా సంపాదకులను వేడుచున్నాము.

— —

# దక్కన్ ఆయుర్వేదవైద్యమండలి

కార్యనిర్వాహక సభ్యుల నెన్నుకొనుట.

ఈ జేష్ఠ బ॥ ౧౪ శనివారము ( ౨౭ అమర్దాదు ౧౩౪౬ ఫ ( ౩జూలై ౧౯౩౭.) సాయంకాలము నాలుగున్నర గంటలకు త్రూపుబజారు హనుమాన్ టేక్డి సమీపమునమున్న కేంద్రసంఘ కార్యాలయము (మ. రా. మాడపాటి హనుమంతరావు పంతులుగారి భవనమున) వైద్యుల సమాలోచన సభ కార్యనిర్వాహకవర్గము నేర్పరుచునిమిత్తము జరుగును.

నియమావళి అచ్చొత్తింపబడినది. ఇదివరకు జరిగిన సభలలో వాగ్దత్తమొనర్చిన ప్రకారము వైద్యమహాశయులు తమ సభ్యత్వపు రుసుమును చెల్లించి సభ్యులుగా చేరిననేగాని సమ్మతినిచ్చుటకుగాని కార్యనిర్వాహక వర్గములో చేరుటకుగాని వీలుండదు. కనుక దయజేసి పై తేదిలోపున సభ్యత్వపు రుసుమును చెల్లించ ప్రార్థన.

దక్కన్ ఆయుర్వేద పాఠశాలను సత్వరముగా స్థాపించవలసియున్నది. మండలి త్వరలో నేర్పడినగాని ఈ కార్యము నెరవేరజాలదు వైద్యమహాశయులు త్వరపడెదరని నమ్ముచున్నాము.

| | |
|---|---|
| గౌలీగూడ<br>హైదాబాదుదక్కన్ | హకీం-డి.జనార్దనస్వామి<br>తాత్కాలిక కార్యదర్శి |

---



---

# H. E. H. Nizam's State Railway

## మ॥ ఘ॥ నిజాం స్టేటు రైల్వే

## ప్రకటన.

౧౯౩౭ జూలై ౧ తేదినుండి టైంటేబిలుమార్పునందున జూను ౩౦ తేది, జూలై ౧ తేది ౧౯౩౭ యీరెండు తేదులలోన, బ్రాడుగేజి మీటరుగేజిలలో ప్రస్తుతము నడుగుచున్న ప్యాసింజరు బండ్లను యీక్రిందివిధముగా మార్పబడును:—

### బ్రాడ్ గేజి

నెం ౮ డౌన్ ఎక్స్‌ప్రెసు వాడినుండి బెజవాడకుపోవునది. వాడిలో ౧౧.౪౫ కు బయలుదేరును. హైదాబాదు బి జిలో ౧౭. ౩౬ కు బయలుదేరును. సికిందాబాదులో ౧౮.౧౦ కు బయలుదేరునది జూన్ ౩౦ది తేదిన డోర్నకల్ లో ౨౩.౪౫ గంటలకు నిలిచిపోవును. డోర్నకల్లు దాటి పైకి పోవలసిన ప్రయాణికులు యీ బండిలో వున్నచో, వారలు యీ బండినుండి మారి నెం ౧౮ డౌన్ ఫ్యాస్టు మిక్స్‌డులో పోవలయును. బండి డోర్నకల్లులో ౭.౩ గంటలకు బయలుదేరి ౧౯౩౭ జూలై ౧ తేది బెజవాడకు ౧౦.౨౦ గంటలకు చేరును.

### మీటర్ గేజ్

౨. నెం ౩౩ అప్ ప్యాసింజరు మన్మాడు నుండి హైద్రాబాదు యం జి వరకు ౧౯౩౭ జూన్ ౩౦ తేదిన బయలుదేరదు. అయితే దానికి బదులుగా నెం ౩౩ అప్ ఫ్యాస్టు మిక్స్‌డు ట్రెయిన్ మన్మాడు స్టేషన్‌నుండి ౩.౪౫ గంటలకు బయలుదేరి ౧౯౩౭ జూలై ౧ తేదిని పూర్ణకు ౧౩.౩౦ గంటలకు చేరును.

| | |
|---|---|
| చీఫు ట్రాన్సు పోర్టేషన్ సూపరింటెండెంటు<br>ఆఫీసు సికింద్రాబాదు<br>౧౯౩౭,జూన్ ౨౮. | అనుమతిని<br>డి. బి. టెర్రివరు<br>చీఫ్ కమ్మర్షియల్ మ్యానేజరు అండు<br>చీఫ్ట్రాన్సు పోర్టేషన్ సూపరింటెండెంటు |

---

# మహావీర్ ఫోటోప్లేస్ అండు థియేటర్సు లిమిటెడు సికింద్రాబాదు (దక్కన్)

సికిందాబాదు, బుల్లైటీన్ బిల్డింగులో తమ హెడ్డాఫీసునందు, ౧౯౩౭ జూను ౧౩ తేది ఆదివారం సాయంత్రం ౪ గంటలకుజరిగినది. మహావీర్ ఫొటోప్లేసు అండు థియేటర్సులిమిటెడు వారిమూడవ జనరల్ బాడీమీటింగులో ౩౧-౧౨-౧౯౩౬ మూడిరిగనే, ౩౦-౬-౧౯౩౭ తేదినగాని అంతకు పైనగాని చెల్లించెడి పద్ధతిమీద; పూర్తిగా చెల్లింపబడియుండెడి కంపెనీ వాటాదార్లకు ౧౦౦ కి ౮ లెఖను డివిడెన్డు డిక్లేర్ చేయబడెను.

—

# సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (లిమిటెడ్)

## కేంద్రస్థానము బొంబాయి

| | |
|---|---|
| షేరరులచే నిలువ చేయబడిన పెట్టుబడి | రు 3,36,00,000 |
| తిరిగి వాపసు ఇవ్వబడిన పెట్టుబడి | రు 1,68,00,000 |
| భాగస్థులయొక్క రిజర్వుడు లైబులిటీ | రు 1,68,00,000 |
| రిజర్వు మరియు కంటిజెన్సీ ఫండు | రు 70,00,000 |

భారతదేశమునందలి ముఖ్యపట్టణములయందంతటను దీని శాఖలుగలవు.

స్థానిక శాఖలు:—హైదరాబాదు, సికింద్రాబాదు

చాలా డిపాసిట్లు:—హాలి, మరియు బీజి చలామణిలలోగూడ ఖాతాలు తెరువబడును. ఒకే మనిషి రెండు చలామణిలలోగూడ ఖాతా తెరుచుకొనవచ్చును.

సేవింగుబ్యాంకు డిపాసిట్లు:—హాలీ, బీ.జి రెండుచలామణులలోగూడ ఖాతాలు తెరువవచ్చును. వడ్డీ 3½ మొత్తి బీ.జి కి ౪ ఇవ్వబడును. ఒకే రెండుచలామణులలోగూడ ఖాతాలు తెరువవచ్చును.

నిర్ణయమైన డిపాసిట్లు మరియు కొద్దికాలపు డిపాసిట్లు.—దీర్ఘకాలపు డిపాసిటును, కొలదికాలపు డిపాసిటును, రెండు చలామణులలోగూడ సమంజసమైన వడ్డీ రేట్లపైన దీసుకొనబడును. వడ్డీ రేట్లు దరఖాస్తుపెట్టి తెలుసుకొనవచ్చును. స్టెర్లింగు డ్రాఫ్ట్సు మరియు టెలిగ్రాఫీ ట్రాన్సుఫర్సు నేరుగా హైదరాబాదునుండియే పంపబడును.

బంగారు కమ్ములు (Goldbard, చక్రవర్తిగారి టంకశాలలో అచ్చొత్తబడిన పది తులముల మరియు అయిదుతులముల బంగారుకమ్ములు అమ్మకమునకు సిద్ధముండును.

సేఫ్‌కెట్టడీ పెట్టబడిన ప్యాకీజులున్ను మరియు సెక్యూరిటీలు భద్రముగానుంచు బాధ్యతపై గైకొనబడును మరియు ఆఖరివానిపై మొత్తి గైకొనబడును.

అన్నివిధములైన బ్యాంకువ్యవహారములు జరుపబడును.

---

# డి స్టార్ ఆఫ్ ఇండియా

## ఇండస్ట్రియల్ అండుజనరలుఅస్యూరెన్సు కంపెని లిమిటెడ్ మద్రాసు

5 స్టార్ ముఖ్యవిషయములు

1 మిగుల తక్కువ ప్రీమియములు
2 డాక్టరు పరీక్షలేదు
3 శాస్త్రీయమగు స్కీములు
4 విభాగపద్ధతి లేదు
5 గవర్నమెంటు సెక్యూరిటీలు కలవు

| | |
|---|---|
| గవర్నమెంటు సెక్యూరిటీలు | రు 65000 |
| చెల్లించిన క్లయిములు | రు 150000 |
| సంవత్సర ఆదాయము | రు 150000 |

శ్రద్ధతో గ్యారంటీగా పనిచేయబడును.

ఏజంట్లు ప్రతి జిల్లా తాలూకాలలోను కావలయును.

ఇట్లు
చీఫ్ సెక్రటరి
డి. స్టార్ ఆఫ్ ఇండియా ఇండస్ట్రియల్ అండు జనరల్
అస్యూరెన్సు కంపెని లిమిటెడ్ హనుమకొండ

---

# ఆంధ్రబ్యాంకు లిమిటెడ్

## హైదరాబాదు దక్కన్

### వడ్డీల వివరము

| | |
|---|---|
| కల్దారు సేవింగ్సు బ్యాంకు ఎకౌంట్లు | 4½% |
| హాలి సేవింగ్సు బ్యాంకు ఎకౌంట్లు | 4% |
| హాలీ లేక కల్దారు కర్రెంటుఎకౌంట్లు (జనవరినుండి జూన్‌వరకు) | 3½% |
| కల్దార్ కర్రెంటు ఎకౌంట్లు (జూలైనుండి డిసెంబరువరకు) | 2% |

ఎకౌంట్లు ఒక్కరి పేరనే హాలీలోను కల్దార్‌లోను తెరువ వచ్చును.

ఫిక్సెడ్ డిపాజిట్లు తీసుకొన బడును.

రేట్ల వివరములు. బ్యాంకునందు తెలుసుకొన వచ్చును.

బ్యాంకు ఉదయం 9 గంటలనుండి తెరచి యుండును.

డి. యస్. శాస్త్రి ఎం. ఏ. సర్ట్. ఎ. ఐ. బి. సెక్రటరి } ఎస్. ఎమ్. ఎస్. విజయం, ఏజంటు

---

# శ్రీకృష్ణాభవను హొటలు

## అబిడ్ బిల్డింగు హైదరాబాదు

ఇచ్చట మంచి భోజనము ప్రసాదములను అందించును ఇష్టమైన ఫలాహారములు దొరకును. ప్రయాణీకులకు సౌకర్యములుగలవు, స్టేషనుకు సామానులు తెచ్చు [illegible] ఈ హొటలు అందించును.

వి. యస్. కృష్ణయ్య ప్రొప్రయిటర్

Sree Krishna Bhavan Hotel.

---

# ప్రకటన

యం. ఆర్. సిద్ధరామయ్య యఫ్. ఆర్. హెచ్.యస్ (లండన్) హార్టికల్చరల్ సర్వేఆఫీసరు

మ॥ ఘ॥ నిజాము వ్యయశాఖ హైదరాబాదు [దక్కను]

౧౯౩౭ జూన్ (అమర్దాదు) హైదరాబాదులో ఫలముల సర్వే ముగిసిన తర్వాత, ౧౫ రెసిడెన్సీరోడు, హెడ్ పోలీసుస్టేషన్‌వద్ద పాయినీరుహార్టికల్చరల్ వ్యాపారమును మరల ప్రారంభించి, తోటపనుల నిమిత్తమై యితరులిచ్చు సలహాలను పొందుచు, ప్రకృతి అలంకారమునకు తగిన తోటల నిర్మించుచు, బాగుగా పరిశీలించి నటువంటి కూరగాయలు, పుష్పముల విత్తనము, మొలకలు మొదలగువాటితో నుండు. క్యాటలాగును నుచితముగ పొంద వచ్చును. ౯ మే ౧౯౩౭

---

# గోలకొండ బుక్ డిపో

| గ్రంథము | వెల |
|---|---|
| ౧. రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧—౪—౦ |
| ౨. సంఘోద్ధరణము | ౦—౮—౦ |
| ౩. కర్నూలురాజుల వంశావళి | ౦—౨—౦ |
| ౪. గరుడోపాఖ్యానము | ౦—౬—౦ |
| ౫. కృష్ణాలహరి | ౦—౨—౦ |
| ౬. చారుమినార్ (పద్యములుసచిత్రము) | ౦—౨—౦ |

మరా:— వ్యాపారస్థులకు మంచి కమీషన్ ఈయబడును. వెంటనే వ్రాసి తెప్పించుకొనుడు.

మేనేజర్ గోలకొండబుక్‌డిపో
తూప్రు బజారు హైదరాబాదు దక్కన్

---

[illegible]

మలబద్ధకము, నరములు అలసిపోవుట అగ్నిమాంద్యము, నరముల బలహీనత. [illegible] లగువానికి ప్రపంచ ప్రసిద్ధి బడసిన మా

## ఆతంక నిగ్రహ మాత్రలు

అద్భుతమగు మందు

50 సంవత్సరములనుండి ప్రసిద్ధి నున్నది.

32 మాత్రల [illegible] 1 రూ

4 రూపాయలకు [illegible] డబ్బులు

ఉచితము! ఉచితము!

## కామ శాస్త్రము

ఆరోగ్యమునకు, ఐశ్వర్యమునకు, అభివృద్ధికి చక్కని దారిచూపునది

ఉచితముగా పోస్టుఖర్చుగూడ లేకుండపంపబడును

కావలసినవారు ఈక్రిందివారికి వ్రాయుడు:—

## ఆతంక నిగ్రహ ఫార్మసి

26, బ్రాడ్వే [illegible]

